

# జాస్మిన్

## అందమైన ప్రేమ కథ



డా.ఎం.హరి కిషన్





# జాస్మిన్

కారు పెద్దాసుపత్రి ప్రధానద్వారంలోంచి ముందుకు తీసుకెళ్ళి కాన్సర్ వార్డ్ దగ్గర ఆపాను. రెండంతస్తుల భవనం. సున్నం వేసి ఎన్నాళ్ళయ్యిందో. రంగు పోయిన పాత చీరలా వెలవెలపోతోంది. బైట పేషెంట్ల బంధువులనుకుంటా. పెరిగిన గడ్డాల్తో, నలిగిన బట్టల్తో, దిగులుగా, దీనంగా… అక్కడక్కడ చెట్ల కింద కనబడుతున్నారు. లోపలికి అడుగుపెట్టాను. ఫినాయిల్ వాసన, రోగాల వాసన, మరుగుదొడ్ల వాసన కలగలసి కడుపులో దేవుతోంది. ‘డాక్టర్ గదెక్కడ’ కనబడిన నర్సుని అడిగాను. గది వైపు చూపించింది.

డాక్టర్ సతీష్ నాకు కోల్సు కాలేజీలో ఇంటర్మీడియట్ స్నేహితుడు. ఒకే బెంచ్. కర్నూల్లో వున్నన్ని రోజులూ అప్పుడప్పుడూ కలిసేవాళ్ళం. గ్రూప్‌వన్ ఆఫీసర్‌గా హైదరాబాద్‌లో స్థిరపడ్డాక ఫోన్లోనే పలకరింపులు. అమ్మానాన్నా ఇక్కడే క్రిష్ణానగర్‌లో వుండడంతో తప్పనిసరిగా కర్నూలుకి సంవత్సరానికి రెండుమూడు సార్లన్నా వస్తుంటాను. సంవత్సరమైంది మిత్రున్ని కలవక. రేపు మరలా ఒక ముఖ్యమైన సమావేశానికి హాజరు కావలసి వుంది. ఈ రోజు పనేమీ లేదు. సరే సమయం చిక్కింది గదాని ముందే ఫోన్చేసి కలసి పోదామని వచ్చాను. గది దగ్గరికి పోగానే కాంపౌండర్ "సార్ ఇందాకే రౌండ్స్‌కి వెళ్ళాడు. కాసేపు కూర్చోండి. వచ్చేస్తాడు" అన్నాడు ఫ్యాను వేసి, కుర్చీ చూపిస్తూ.

అట్లా అక్కడే ఒక్కన్నే కూర్చోబుద్ధిగాక ఒకొక్క గదే తిరుగుతూ నడవసాగాను. అట్లా జనరల్ వార్డ్‌లోకి వచ్చాను. వరుసగా మంచాలేసి వున్నాయి. రోగులు, వాళ్ళతోబాటు వచ్చిన బంధువులతో కిటకిటలాడుతోంది. నెమ్మదిగా ఒకొక్క మంచమే దాటుకుంటూ పోతూ వుంటే ఒక బెడ్‌పైన ఏదో పరిచిత ముఖం తళుక్కున మెరిసింది.

ముందుకు పోతున్న వాన్నళ్ళా ఆగి వెనక్కి చూశాను.

ఆ మంచం చుట్టూ ఎవరూ లేరు.

ఆమె ఒక్కతే...

ఒళ్ళంతా తెల్లగా పాలిపోయి, పీక్కుపోయిన ముఖంతో, ఎక్కడికక్కడ కండలు కరిగిపోయి... చావుకీ బ్రతుక్కీ మధ్య వూగిసలాడుతున్నట్లుగా వుంది.

ఆమె ముఖం వంక పరిశీలనగా చూశాను.

కళ్ళు మూసుకొని వుంది.

నిద్రో... తెరిచే శక్తి లేదో... తెలీడం లేదు.

అదే... అదే... ముఖం...

అదే ముఖం కాదు ఆమే...

ఒళ్ళంతా తెలియకుండానే చిన్నగా ఒణుకు. గుండె వేగంగా కొట్టుకోసాగింది. కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది.

శక్తినంతా కూడగట్టుకుంటూ నెమ్మదిగా మంచం దగ్గరికి చేరుకున్నాను. వేరే రోగుల దగ్గరున్న వాళ్ళంతా మాటలు ఆపేసి నన్నే విచిత్రంగా చూస్తున్నారు. బహుశా నా ఖరీదైన దుస్తులు వాళ్ళని ఆశ్చర్యపరుస్తున్నట్లున్నాయి. స్టూలు జరుపుకొని దగ్గర కూర్చున్నాను. ఆమె కళ్ళు మూసుకునే వున్నాయి.

తదేకంగా ఆ ముఖం వంకే చూస్తూ చేతి మీద చేయి వేశాను.

ఆ స్పర్శకు ఏదో కదలిక.

కళ్ళు కొద్దిగా తెరిచి చూసింది.

మరు నిమిషంలోనే ఆమె కళ్ళు పెద్దగయ్యాయి.

నమ్మలేనట్లుగా వున్నాయి.

పెదాలు కొద్దిగా వణికాయి.

అట్లాగే నా కళ్ళలోకి చూస్తుండిపోయింది.

నెమ్మదిగా ఒక మెరుపు కళ్ళ నుంచి ముఖమంతా వ్యాపించి పెదాల మీద చిరునవ్వుగా వెలిగింది.

నా చేతిని గట్టిగా పట్టుకుంది.

చుట్టూ అందరూ అర్ధంగాక చూస్తున్నారు... ఆ చూపుల్లో అనేక ప్రశ్నలు, అనుమానాలు, ఆశ్చర్యార్థకాలు.

వేటినీ పట్టిచ్చుకోలేదు.

ఆప్యాయంగా ఆమె తలవెంద్రుకలు నిమిరి చేతి మీద ముద్దు పెట్టుకొని "డాక్టర్ నా స్నేహితుడే. పిలుచుకోని వస్తాను" అంటూ సున్నితంగా చేయి విడిపించుకోని గదికి చేరుకున్నాను.

సతీష్ ఇంకా రాలేదు. ఫ్యాను కింద కూర్చున్నాను.

ఆమె చిరునవ్వు మరలా మరలా కళ్ళ ముందు మెదులుతూ వుంది.

పది పదైదు సంవత్సరాల గతం ముందుకూ వెనక్కూ ఆలోచనల్లో దొర్లుతూ వుంది. కాళ్ళు చాపుకొని కుర్చీలో జారగిలపడ్డాను.

అది నేను డిగ్రీ ఫైనలియర్ ఎస్టీబీసీ కాలేజీలో చదువుతున్న సమయం. ఎండాకాలం కరెంటుకోత. ఉడకకు తట్టుకోలేక చేతిలో పుస్తకంతో మిద్దె మీదికి చేరుకున్నాను. పరీక్షలు మరెంతో దూరం లేవు.

తదేకంగా చదువుతుంటే ఎక్కడి నుంచో అలలు అలలుగా వినిపించీ వినిపించనంత నిశ్శబ్దంగా గజ్జెల శబ్దం.

తలెత్తి చూశాను.

వెనుక ఇంటి మీద ఒకమ్మాయి అప్పుడే తలస్నానం చేసినట్లుంది. తల ముందుకు వంచి నల్లని జలపాతంలా ముందుకు దుంకుతోన్న శిరోజాలలోని నీటి తుంపరలను మెత్తని గుడ్డతో విదిలిస్తూ వుంటే ఆమె ముఖం కనబడక కుతూహలంగా చూడసాగాను.

ఒక్కసారిగా విసురుగా వెంద్రుకలను వెనక్కు తోసుకుంటూ తలెత్తింది.

ఎవరో అద్భుత శిల్పకారుడు తెల్లని పాలరాయితో చెక్కిన చక్కని శిల్పంలా వుంది. కనురెప్ప వేయడం మరచి ఎంతసేపయిందో. ఆమె అనుకోకుండా నావైపు చూసింది. ఊపిరి ఆగిపోయినట్లయింది. ఆమె భృకుటి ముడివడింది. కోపం కళ్ళల్లో అలలా ప్రవహించింది. గిరుక్కున వెనుదిరిగి మెట్ల మీదుగా అదృశ్యమైపోయింది.

వాళ్ళ ఇల్లు సరిగ్గా మా ఇంటికి వెనుక వైపు వుంది. మధ్యలో చిన్న సందు ఇళ్ళను విడదీస్తూ వుంది. మా ఇంటి ముఖం ఇవతలి సందువైపు వుండడంతో ఆమెని ఎప్పుడూ చూడలేదు. అంత అద్భుత సౌందర్యాన్ని ఇంతకాలం మిస్సయినందుకు మనసు బాధతో మూలిగింది.

ఆరోజు నుంచీ సాయంత్రం కాగానే ఎక్కడున్నా, ఎంత పనున్నా కాళ్ళు డాబా మీదకు పరుగులు తీసేవి.

వాళ్ళ ఇంట్లో నుంచి ఒక మల్లెపూల చెట్టు మిద్దె మీదికి గుబురుగా పాకింది. ఎండాకాలం కావడంతో మొగ్గలు ఆకులతో పోటీ పడుతూ వాటి పచ్చదనాన్ని మాయం చేస్తున్నాయి. సాయంకాలం కాస్త చల్లబడగానే చేతిలో పెద్దగిన్నెతో మిద్దె మీద ప్రత్యక్షమయ్యేది. ఒకొక్క మొగ్గనే మునివేళ్ళతో సుతారంగా తుంచుతూ గిన్నెలో వేసుకునేది.

సాయంకాలం కావడం ఆలస్యం నా చూపులు ఆ మల్లెచెట్టు చుట్టూరానే తిరుగుతుండేవి.

ఆమె రాక కోసం గుండె కొట్టుకుంటా వుండేది.

మొదట్లో నన్నస్సలు చూసేది కాదు.

చూసినా కళ్ళలో నిప్పుల మందారాలు కురిసేవి.

రోజులు గడుస్తున్న కొద్దీ పువ్వులు కోసుకుంటూనే అప్పుడప్పుడు ఓరగా కనురెప్పలెత్తి దొంగచాటుగా గమనించేది.

కొద్ది రోజులకు పెదాలు విరజాజుల్లా విచ్చుకోసాగాయి.

నెమ్మదిగా ముఖమంతా వెలుగులు విరజిమ్మడం మొదలయ్యింది.

అలా అలా... చూపులు కలుపుకొని, చిరునవ్వులు ప్రవహించి, చిన్న చిన్న సైగల వరకు వెళ్ళింది.

ఆమె పేరేదో నాకు తెలీదు.

దాంతో "జాస్మిన్" అని నాకు నేను పెట్టుకున్నాను.

జాస్మిన్‌కు రెండు మూడు దుస్తులకన్నా ఎక్కువ లేవనుకుంటా. ఉన్న వాటినే మార్చి మార్చి వేసుకునేది. అప్పుడప్పుడూ మోకాళ్ళ మధ్య తల దాచుకొని ఏదో విషాదంగా కనిపించేది. కింది నుంచి ఏవేవో అరుపులు, కేకలు వినబడుతుండేవి. ఒణుకుతున్న అధరాలతో, కందిన బుగ్గలతో బెదురుబెదురుగా వుండేది.

కానీ... అదంతా కాసేపే.

నన్ను చూసిన కొద్ది క్షణాలలోనే పెదాలపైకి చిరునవ్వులు వచ్చి వాలేవి.

నవ్వుతూ రెండు చేతులూ జోడించి నమస్కారం పెట్టి ఫక్కున నవ్వేసేది.

ఆ పలకరింపుల మధ్యలోనే కింది నుంచి వాళ్ళమ్మ కేక వినబడేది. పూలతో నిండిన గిన్నెతో చివరిసారిగా చూపులు నా గుండెల్లో దిగేలా విసురుతూ చెంగున మెట్లు దిగి వెళ్ళిపోయేది.

కొన్ని వందల వేల సార్లు ఆ నవ్వులను, ఆ చూపులను తలచుకుంటూ... ఆ ఎర్రని తేనెలూరే పెదాలను కలగంటూ... ఏవేవో కోరికలతో, ఆశలతో, ఊహలతో భవిష్యత్తును కలగంటూ తరువాత రోజు సాయంత్రం వరకూ బ్రతుకుతూ వుండేవాన్ని.

అదే సమయంలో చదువును గూడా వృధా చేసేవాన్ని కాదు. పరీక్షలు ముగిశాయి. సెలవులు వచ్చాయి.

అనుకోకుండా జాస్మిన్ కనిపించకుండా మాయమైంది.

ఎన్ని రోజులు ఎదురు చూశానో.

ఆగలేక ఇంటికి పోయి చూస్తే తాళం మౌనంగా వేలాడుతూ కన్పించింది.

ఆ తర్వాత కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పీజీ సీటొచ్చింది. తప్పని సరిగా అనంతపూరుకు వెళ్ళాల్సొచ్చింది. మధ్యమధ్యలో కర్నూలుకు వచ్చినప్పుడల్లా అనేకసార్లు ఆ ఇంటివైపు వెళ్ళేవాన్ని. వేరేవాళ్ళు ఎవరో చేరినట్లు అర్థమైంది.

జాస్మిన్ ఏమైపోయిందో, ఎక్కడికెళ్ళిందో అర్థం కాలేదు.

స్నేహితుల ద్వారా వివరాలు సేకరిస్తుంటే... పేపర్‌మిల్లు కార్మికుడైన వాళ్ళ నాన్న అది మూతపడడంతో, తెరుస్తారేమోనని ఎదురు చూసీ చూసీ నిరాశతో, మానసిక ఆందోళనతో మరణించాడని, ఇంటిని చూసుకోవాల్సిన అన్న దొరికినంత మూటగట్టుకొని ఎవరినో లేపుకొని పోయాడనీ, దాంతో వాళ్ళమ్మకు పక్షవాతమొచ్చి మంచానికే అతుక్కుపోయిందనీ... అడిగేవాళ్ళెవరూ లేకపోవడంతో బరితెగించి బజారు మీద పడిందనీ... ఏవేవో... ఎన్నెన్నో.. కథలు కథలుగా... విని భరించలేకపోయేవాన్ని... మనసు మౌనంగా రోదిస్తూ వుండేది. ఎప్పుడన్నా ఒక్కసారన్నా కనబడుతుందేమోనని రోడ్ల మీద కళ్ళు నిరంతరం ఆశగా వెతుకుతూనే వుండేవి.

ఒకరోజు నటరాజ్ టాకీస్ పక్కసందులో చీకట్లో నడుస్తూ వుంటే పాత అమరావతీ టిఫెన్ సెంటర్ దగ్గర ఒక వెలిగీ వెలగని వీధిదీపం కింద...

ఎవరి కోసమో ఎదురుచూస్తూ...

జాస్మిన్...

చాలా రోజులైంది చూసి. జాస్మినా కాదా అని పట్టిపట్టి చూస్తూ అడుగుల వేగం తగ్గించాను. కాస్త ఒళ్ళు చేసింది. శరీరంలో వయసులో వచ్చిన మరికొన్ని మార్పులు.

కానీ ఆ కళ్ళు మాత్రం అలాగే.

నిలబడిపోయాను రోడ్డుకి అవతలివైపుగా.

ఎవరా అన్నట్లు తలెత్తి చూసింది.

కొద్ది క్షణాల్లోనే ఆమె కనురెప్పలు విశాలమయ్యాయి.

ముఖమంతా వేయి చందమామల వెలుగు.

అంతలోనే ఛటుక్కున తల దించుకుంది.

ఆమె శరీరం చిన్నగా వణుకుతోంది.

ఆమె వైపు అడుగు ముందుకు వేశాను.

అంతలో ఒక ఆటో వచ్చి మధ్యలో ఆగింది. లోపల ఎవరో వున్నట్టున్నారు. చీకట్లో ఏమీ కనబడ్డం లేదు. జాస్మిన్ తలదించుకొనే మౌనంగా ఆటో ఎక్కేసి వెళ్ళిపోయింది.

ఆ రోజు రాత్రంతా నిద్ర లేదు. మనసంతా ఆమె పరిమళమే.

కొంచెం సేపు సంతోషం, కొంచెం సేపు దుఖం, ఏమేమో అడగాలనీ, ఎన్నెన్నో చెప్పాలనీ, వేగంగా ప్రయాణించే కాలంతోబాటు ప్రయాణించలేక గతంలోకి జారిపోతూ... ఆనందాల్ని ఏరుకుంటూ, మాల గుచ్చుకుంటూ, ఏకాంతాన్ని వసంతంగా మార్చుకుంటూ... తరువాతరోజు సాయంత్రం వరకూ గడిపేశాను.

చీకటి పడే సమయానికంతా పరుగులాంటి నడకతో నిన్న కనబన్న చోటుకి చేరుకున్నాను.

మనసులో ఏదో చిన్న ఆశ.

చీకటి వెలుతురును కమ్ముకుంటూ తనలో ఐక్యం చేసుకుంటూ వుంది.

వస్తుందా... రాదా... రోడ్డు ఆ చివర నుంచీ ఈ చివర వరకూ కళ్ళతోనే వెదుకులాడసాగాను.

నిరాశ చుట్టుకుంటోంది.

ముఖం పాలిపోతోంది.

కళ్ళలో దుఃఖం కమ్ముకుంటా వుంది.

అంతలో... ఒక చిన్న పిల్ల తెమ్మెర... మల్లెపూల మరిమళాన్ని మోసుకుంటూ వచ్చి తాకింది.

గిరుక్కున వెనుదిరిగాను.

కాస్త దూరంగా గోడనానుకొని తదేకంగా నన్నే చూస్తోన్న జాస్మిన్.

ఎంతసేపయిందో వచ్చి.

ఫక్కున ఇంద్రధనస్సులా నవ్వింది.

వేగంగా ముందుకు వచ్చి గట్టిగా నా చేయి పట్టుకొని అటుగా వస్తున్న ఆటోను ఆపి ఎక్కించింది.

నా నోట మాట రావడం లేదు.

ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న వానిలా ఆమె వెంట నడిచాను.

ఆటో కొండారెడ్డి బురుజు మీదుగా పోయి సాయిబాబా గుడి దగ్గర ఆగింది.

ఎవరూ గుర్తుపట్టకుండా కొంగు తల మీదుగా కప్పుకుంది.

నా చేయి ఆమె చేతిలోనే వుంది.

గుడిమెట్లు దాటి కిందికి తుంగభద్రలోకి దారి తీసింది.

మొదట్లో కొంచెం నీళ్ళున్నాయి. అది దాటగానే అంతా ఇసుక. కాళ్ళు మెత్తగా కూరుకుపోతున్నాయి. మనుషులెవరూ కనిపించని చోటుకు, మాటలు వినిపించని చోటుకు... మధ్యలో పారుతున్న నీటి పాయ పక్కనే వున్న పచ్చిక వద్దకు తీసుకెళ్ళింది.

చల్లని గాలి స్పృశిస్తూ వుంది. నల్లని మబ్బుల్లోంచి వెలుతురు చినుకులు చినుకులుగా రాలుతోంది. ఎదురెదురుగా కూర్చున్నాం.

ఆమె కళ్ళు నాలోకి తొంగి చూస్తున్నాయి.

ఆమె ఒంటి పరిమళం గాలినంతా సుగంధభరితం చేస్తోంది.

"ఎన్ని రోజులైంది నిన్ను చూసి. అసలు నువ్వు వస్తావనుకోలేదు" అన్నా నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

అనుకోకుండా ఆమె కళ్ళలోంచి ఒక్కసారిగా గంగ పుప్పొంగింది.

నేనామెను దగ్గరకు తీసుకున్నానో, ఆమే నాకు దగ్గరయిందో... నా ఒళ్ళో గువ్వలా ఒదిగిపోయింది.

పక్కనే నదిలోంచి వీస్తున్న చల్లని గాలి, ఇసుకలోంచి ఎగస్తున్న వేడిగాలులతో సంగమిస్తూ వాతావరణాన్ని చల్లబరుస్తోంది. ఒకరినొకరం అల్లుకుంటూ, వెదుక్కుంటూ, ఆస్వాదిస్తూ, సహకరిస్తూ... కాలం కాసేపు స్తంభించిపోయింది.

అలసి వేరుపడ్డాం.

ఒకరి చేయి ఒకరం పట్టుకొని అలా ఎంతసేపు ఆకాశాన్ని చూస్తూ నిశ్శబ్దంగా వుండిపోయామో తెలీదు.

ఎక్కడో దూరం నుంచి సన్నగా పోలీస్ విజిల్.

జాస్మిన్ వులిక్కిపడి లేచి గబగబా చీర కట్టుకుంటూ చేయి చాపింది.

"రేయ్... ఇకపై అన్నీ వదిలేసి నాతో వచ్చేయ్... ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదాం" అన్నా.

జాస్మిన్ తుంగభద్ర ప్రవాహంలా గలగలా నవ్వింది.

ఆప్యాయంగా నా జుట్టులోకి వేళ్ళు జొనిపి తల వంచి నుదుటిపై మృదువుగా చుంబించింది.

నేను ఏదో చెప్పబోతున్నంతలోనే గబగబా నడవడం మొదలుపెట్టింది. నేను బట్టలు వేసుకునే లోపలే కళ్ళ ముందు నుంచి మాయమైంది. ఎంత వెదికినా కనబడలేదు.

తరువాతరోజు మళ్ళీ సరిగ్గా అదే సమయానికి వెళ్ళాను.

ఊహూ... లాభం లేదు.

అట్లా ఎన్ని సార్లు... ఎన్ని గంటలు ఎదురుచూశానో.

కర్నూలుకి ఎప్పుడు వచ్చినా చీకటి పడితే చాలు ఆ వీధిదీపం దగ్గరికి కాళ్ళు పరుగులు తీసేవి.

పీజీ పూర్తయి ఉద్యోగం సంపాదించి, పెళ్ళి చేసుకొని, ఇద్దరు పిల్లలు పుట్టే వరకూ జాస్మిన్‌ను మరలా నేనెప్పుడూ చూడలేదు.

ఒకసారి శివరాత్రికి కాల్వబుగ్గ చూసొద్దామని రాజ్‌విహార్ దగ్గర భార్యాపిల్లల్తో బస్సు కోసం ఎదురు చూస్తూ వున్నాను. సంవత్సరం వయసున్న కొడుకు భుజమ్మీద తలబెట్టుకొని నిదురపోతున్నాడు. పాప అమ్మ చేయి పట్టుకొని ఏదో చెబుతూ వుంది. అసహనంగా గడియారం చూసుకుంటూ బస్సు కోసం ఎదురుచూస్తుంటే ఎవరో వెనుక చటుక్కున గోడచాటుకు తప్పుకున్నట్టనిపించింది.

కొద్దిసేపు ఏమీ అర్థం కాలేదు.

ఎవరు... నన్ను చూసేనా... ఎందుకు... కుతూహలం పెరిగింది.

గోడచాటు నుంచి చూపులు వీపుకి గుచ్చుకొంటున్నాయి.

తల వంచి కళ్ళను సాధ్యమైనంతగా తిప్పి చూశాను.

గాలికి ఒక పాత మాసి, చినిగి పోయిన చీర వూగుతూ వుంది. చాలారోజులుగా తైలసంస్కారం లేక జడలు కట్టిన జుట్టు కొంచెం కనబడుతూ వుంది. ఆమె చూపులు నా భార్యాపాపల మీద వున్నాయి. ముఖం కనబడ్డం లేదు. బాబుని ఎత్తుకొనే అలా దూరంగా వెళ్ళినట్లుగా వెళ్ళి నెమ్మదిగా వెనుకవైపుగా వచ్చాను.

వీపు కనబడుతూ వుంది.

తెల్లని శరీరం... చిక్కిపోయి... ముడతలు పడి... ఎవరా అని ఆలోచిస్తా వుంటే నా అడుగుల సవ్వడికి వెనుదిరిగి చూసింది.

ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాను.

'జాస్మిన్'.

ఏ మాత్రం గుర్తు పట్టేలా లేదు. ముప్పై ఏళ్ళకే యవ్వనమంతా కరిగిపోయి, వృద్ధాప్యం కమ్మివేసినట్లుగా ముఖమంతా ముడతలు పడి, కళ్ళు లోపలికి పోయి, ఎక్కడికక్కడ ఎముకలు బైటపడి, అస్థిపంజరానికి చీర కట్టినట్టుగా వున్న నా కలలరాణి.

నన్ను చూడగానే ఆమె చూపులు తడవడ్డాయి. పెదాలు వణికాయి. భయం భయంగా తల దించుకొంది.

నాకు నోట మాట రావడం లేదు. జాస్మిన్‌ను ఇట్లా చూస్తానని కలలో గూడా వూహించలేదు. పలకరిద్దామని నోరు తెరిచాను. కానీ బస్టాప్‌లో కొందరు నన్నే చూస్తున్నారు. పరువు, మర్యాద అడ్డం వచ్చాయి. మాట నోటిలోనే ఆగిపోయింది. ఆమె చేతి వంక చూశాను. గుప్పిట్లో చిల్లర. జేబులో చేయి పెట్టాను. ఐదువందల రూపాయల నోట్లు నాలుగు తగిలాయి. తీసుకోమన్నట్లుగా చేయి చాపాను.

జాస్మిన్ తలెత్తి నా కళ్ళలోకి చూసింది. పెదాల మీద తళుక్కున చిరునవ్వు మెరిసింది. వద్దన్నట్లుగా తలూపుతూ రెండడుగులు వెనక్కు వేసింది. బలవంతంగా చేతిలో పెడదామనుకున్నాను. కానీ ఎవరన్నా గమనిస్తే... నా భార్య చూస్తే... ఏం చేయాలో తోచక సతమతమవసాగాను.

అంతలో బస్సు వస్తున్న శబ్దం. "తీసుకో" అన్నాను మరోసారి. ఆమె నిశ్శబ్దంగా చిరునవ్వుతో అలాగే నిలబడిపోయింది. ఏం చేయాలో తోచక బాబుతో వేగంగా ముందుకు వచ్చాను. అప్పటికే నా భార్య నా కోసం కంగారుగా అటూయిటూ వెదుకుతూ వుంది. "ఎక్కడికెళ్ళారండి" అంది నే కనబడగానే. చిటికెన వేలు చూపిస్తూ పాప చేయి పట్టుకొని వడివడిగా బస్సెక్కి కిటికీ పక్కన కూర్చున్నాను.

జాస్మిన్ బస్‌షెల్టరును ఆనుకొని తదేకంగా నన్నే చూస్తూ వుంది. ఆ చూపుల్లో ఏదో చెప్పలేని భావం. పెదాల మీద చిరునవ్వు పాదరసంలా ప్రవహిస్తూనే వుంది. బస్సు కదిలింది. అప్రయత్నంగా నా కళ్ళల్లో నీళ్ళు చిమ్మాయి.

"డాడీ... ఏమైంది... ఎందుకేడుస్తున్నావ్" అంది పాప.

నా భార్య తలెత్తి ఆశ్చర్యంగా చూసింది.

"ఏం లేదమ్మా... కంట్లో పడగూడనిదేదో పడ్డట్టుంది" అన్నాను కర్చీఫ్ తీసుకుంటూ.

అలా ఆరోజు చూసిన జాస్మిన్ మరలా సంవత్సరం కూడా కాకముందే ఇక్కడ ఆసుపత్రిలో మంచమ్మీద. ఆలోచనల్లోనే సతీష్ వచ్చాడు.

ఆప్యాయంగా కరచాలనం చేస్తూ "సారీ... కాస్త ఆలస్యమైంది" అన్నాడు నవ్వుతూ. మాటల్లోనే "సతీష్... నాకు బాగా తెలిసిన అమ్మాయి. పరిస్థితేం బాగున్నట్లు లేదు. కాస్త కేర్ తీసుకోగలవా. అవసరమైన డబ్బు నే పంపిస్తాను" అన్నాను.

"ఎవరు" అంటూ సతీష్ నా వెంట నడిచాడు.

జాస్మిన్‌ను చేరుకున్నాం.

ఆమె కళ్ళు నేను వెళ్ళిన గది వైపే అచేతనంగా చూస్తూ వున్నాయి.

సతీష్‌కి అనుమానమొచ్చి ఆమె నాడి పట్టుకొని చూశాడు.

శరీరం చల్లగా వుంది.

తలడ్డంగా వూప్తూ... "సారీ... షీ ఈజ్ డెడ్" అన్నాడు.

నాకు గుండె పిండేసినట్లయింది.

"ఆరు నెల్లుగా ఇక్కడే వుంది కాన్సర్‌తో పోరాడుతూ... దానితోబాటు శరీరమంతా రకరకాల జబ్బులు. బహుశా ఎవరూ లేరనుకుంటా. శవాన్ని మార్చురీకి తరలించాలి" అన్నాడు.

ఎవరూ తీసుకోకపోతే...

అనాథ శవంలా...

నా జాస్మిన్...

గుండె కొట్టుకుంటా వుంది.

సిగ్గు, మర్యాద వదిలేశాను.

తడబడుతున్న గొంతుతో "రేయ్... ఎందుకు, ఏమిటి అనడగొద్దు. ఫార్మాలిటీస్ పూర్తి చేసి నాకప్పగిస్తే గౌరవంగా ఖననం చేస్తాను. ఈ ఒక్క సహాయం చేయగలవా" అన్నాను.

సతీష్ ఆశ్చర్యంగా నా వంక చూశాడు.

నా కళ్ళలో కన్నీటిపొర వాన్ని ఏ ప్రశ్నలూ వేయించలేదు.

సరేనంటూ వెళ్ళిపోయాడు.

అంతలోపు హంద్రీనది పక్కనే జమ్మిచెట్టు ముందున్న శ్మశాన వాటికకు చేరుకొని గుంత తవ్వడానికి, దాసరిని పిల్చుకు రావడానికి డబ్బులిచ్చి వచ్చాను. వైకుంఠ రథానికి ఫోన్ చేశాను. సాయంత్రానికంతా సంతకాలు తీసుకొని శవాన్ని అప్పజెప్పారు.

వైకుంఠ రథం వెంట కారులో శ్మశానానికి చేరుకున్నాను.

దాసరోనికి ముందే అడిగినంత డబ్బులియ్యడంతో మారు మాట్లాడకుండా చేయాల్సిన కార్యక్రమాలు చేసి శవాన్ని గుంతలో చేర్చారు. చీకటి పడే సమయానికంతా బూడ్చడం పూర్తయ్యింది. అందరికీ డబ్బులు ఇచ్చేశాను. కారులోంచి మల్లెపూల దండ తీసుకువచ్చి సమాధిపై పెట్టి అగరుబత్తులు వెలిగించాను.

కాటికాపరిని పిలిచి చేతిలో వేయి రూపాయలు పెడుతూ "ఓ పదిరోజులు గుప్పెడు మల్లెపూలు ఆ సమాధి మీద వుంచు" అన్నాను.

అతను అలాగేనంటూ "సార్... అప్పట్నించీ అడగాలనుకుంటున్నా... ఆ అమ్మాయి మీకేమవుతాది" అన్నాడు.

తలెత్తి చూశాను.

చీకటిలో అతని ముఖం అస్పష్టంగా కనబడుతూ వుంది.

ఏమీ మాట్లాడకుండా బైటకొచ్చి మౌనంగా కారెక్కాను.

అంతవరకూ ఆపుకుంటున్న దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకొంది.

వెక్కి వెక్కి ఏడుస్తూ స్టీరింగ్ మీద వాలిపోయాను.

**ఆంధ్రజ్యోతి, ఆదివారం 9 డిసెంబర్, 2007**



# జాస్మిన్

## అందమైన ప్రేమ కథ




డా.ఎం.హరి కిషన్

94410 32212



